# విశ్వబ్రాహ్మణ కరణీకాల చరిత్రము

"[illegible]"
పడకండ్ల వెంకటాచార్యులు

*

ప్రధానోపాధ్యాయులు.
బ్రహ్మశ్రీ పడకండ్ల వెంకటాచార్యులు

రచన :

చరిత్ర పరిశోధకులు
శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ, B. A;

మోపట్ల
విశ్వకర్మ సాహిత్య ప్రచార మండలి
తెల్లగాంధీ బొమ్మ వద్ద
సంత బజారు, చీరాల - 523 155

*

ప్రకాశకులు :
శ్రీ విశ్వకర్మ సాహిత్య ప్రచారమండలి, తెనాలి.

వెల : రూపాయి
Rs 6 = 00

*

# విశ్వబ్రాహ్మణ కరణీకాల చరిత్రము

*

ప్రధానోపాధ్యాయులు,

బ్రహ్మశ్రీ పడకండ్ల వెంకటాచార్యులు

# నివేదన

విశ్వబ్రాహ్మణుల చరిత్రమును ఆదినుండి తరచి చూచినచో వీరి ప్రతిభకు ప్రతీకలని వీరు చేసిన కృతులద్వారా స్పష్టపడగలదు.

చదువులలోను, పదవులలోను, శిల్పకళాఖండాల నిర్మాణంలోను, కవనంలోను మరెన్నో రంగాలలో భువనంలో రాణించి విశ్వబ్రాహ్మణ సోదరులు ఒక చరిత్రనే సృష్టించినారు.

విశ్వబ్రాహ్మణుల మహోన్నత చరిత్రను కాదనలేని గురుతులు నేల నాల్గుచెఱగుల మనకు దర్శనం ఇస్తూనే ఉన్నవి.

యశోభూషణులై మన విశ్వబ్రాహ్మణులు ఎట్లు ప్రసిద్ధిని పొందిరో ఆ చరిత్రను మనము ఊరక చదువుటతో సరిపోదు.

పూర్వ ఘట్టములను సదా మననం చేసుకొంటూ భవిష్యత్తులో మరింత సుందర చరిత్రను నిర్మించుటకు చైతన్యమూర్తులై మన విశ్వబ్రాహ్మణ సోదరులు ముందడుగు వేయుటే నేటి కర్తవ్యము.

మన విశ్వబ్రాహ్మణులు కరణాలుగా ఎట్లు ప్రకాశించి ప్రతీతిని బడసిరో తెలియజేయుటకు ఈ చిన్నిపుస్తకము ప్రచురింపబడుచున్నది. ఇందలి విశేషములు పుక్కిటి పురాణములు కావు.

గుంటూరు జిల్లా, మోపర్రు వాస్తవ్యులు, చారిత్రక పరిశోధక శిరోమణి శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ, బి. ఎ; గారు 1946 సం॥లో సాధికారికంగా వ్రాసి అచ్చువేయించిన అంశములివి.

మరుగునపడియున్న ఈ కరణీకాల చరిత్రమును కేవలము విశ్వబ్రాహ్మణులకేగాక ఇతరులకెల్లరకు తెలియజేయుటకై ప్రచురించెదమని కోరినంతనే శ్రీ లక్ష్మీనారాయణగారు తమ ఆమోదమును ప్రకటించినారు.

ఇందుకు విశ్వకర్మ సాహిత్యమండలి వీరికి కృతజ్ఞతల నందించుచున్నది.

విశ్వబ్రాహ్మణుల పూర్వవైభవమును సర్వజనులు దీనిద్వారా తెలిసికొందురుగాక !

328

# విశ్వబ్రాహ్మణ కరణీకాల చరిత్రము

విశ్వబ్రాహ్మణులు బ్రాహ్మణులవలె ధీశక్తి సంపన్నులు; కవులు; గాయకులు; శిల్పకారులు; పండితులు; శిలాలేఖనము చేసినవారు. వీరి సాహిత్యకృషి ప్రశంసనీయమైనది. కాని వీరికి బ్రాహ్మణులకు వైరభావమేలకలిగినదో మూలకారణము తెలియకున్నది. బ్రాహ్మణ రచయిత కావ్యములలో, శతకములలో, "ఏజాతివానినైన నమ్మవచ్చునుగాని, అగసాలెవానిని నమ్మరాదు" అని అనేకచోట్ల వ్రాయబడియున్నది. ఇట్టి వ్రాతలు వ్రాయుటకు, వారికిగల ద్వేషభావమేమిటో స్పష్టముగా తెలియకున్నది.

పల్నాడు తాలూకాలోని మాచెర్ల గ్రామములో నొక శాసనము గలదు. అందు ఆదిత్యేశ్వర దేవాలయమును, నాగస్తంభమును నిర్మించిన శిల్పకారులు ప్రశంసింపబడినారు. బ్రహ్మకుమారుడయిన విశ్వకర్మ, శిల్పకారులకు మూలపురుషుడని ఈ శాసనమున ఉన్నది. విశ్వకర్మ వంశములోని కొందరు ఆచార్యుల పేర్లుగలవు. వారు వాస్తుశాస్త్రమునందు ఆరితేరినవారు; శివలింగముల, విగ్రహముల. ప్రాసాదముల నిర్మించుటలో నేర్పరులు, ప్రజ్ఞావంతులని ఈ శాసనములో గలదు. వీరి శిల్పమువలన భారతీయులకు ఖండఖండాంతర ఖ్యాతి లభించినది.

జాతకకథలలోగూడ బంగారుపనివారు, కంకణములు, ముద్రికలు, మాలలు, కుండలములు, మేఖలలు, బంగారుపళ్ళెములు మున్నగునవి చేయుచుండిరని తెలియుచున్నది. అజాతశత్రుడు పేర్కొన్న 25 శ్రేణులలో

స్వర్ణకారులు గలరు. వీరు విశ్వబ్రాహ్మణులే కావచ్చును. విశ్వబ్రాహ్మణులు, శిల్పకారులే కాకుండా, కరణీకపు ఉద్యోగములలోనున్నట్లు అనేక ఆధారములవలన ఎరుంగవచ్చును. కాని ఈ కరణీకములు చాలభాగము పోయి, బ్రాహ్మణులకు లభించినవి. ఈ చారిత్రక సత్యము అనేక గ్రంథములలో నుల్లేఖింపబడినది.

## ఆధారములు

జైన నాగదేవభట్టు రచించిన కొండవీటి దండకవిలె, చెన్నరాజధాని కౌన్సిలు మెంబరు డి. యఫ్. కార్మికన్‌గారి ఆజ్ఞప్రకారము, కృష్ణా జిల్లా సంస్కృతాంధ్ర పండితులు బుక్కపట్టణము రాఘవాచార్యులుగారు వ్రాసిన ఆంధ్రదేశ చరిత్రము, [అముద్రితము; ఊరె వీరభద్రకవి కృత కరణీకోద్ధారిణి, కృష్ణా డి. మాన్యుయల్, ముప్పదియిద్దరు మంత్రుల చరిత్రము, కలనల్ మెకంజీ సేకరించిన గ్రామకైఫీయతులు, [72 సం.] అనేక శతకములు, కావ్యములు ఈ చరిత్రకాధారములు.

## గోపరాజు రామ ప్రధాని

విశ్వబ్రాహ్మణుల కరణీకోద్యోగముల దీయించి బ్రాహ్మణుల కొసంగినవాడు "గోపరాజు రామప్రధాని" ఈయన కాలనిర్ణయమును గూర్చి చాలమంది పొరపడిరి. చిలుకూరి వీరభద్రరావుగారిట్లు వ్రాసిరి. "ఇతడు, గణపతిదేవ చక్రవర్తియొక్క బ్రాహ్మణ మంత్రులలో సుప్రసిద్ధుడు. గణపతిదేవుని కాలమువరకును విశ్వబ్రాహ్మణులమని చెప్పుకొను స్వర్ణశిల్పులును, శూద్రులును మాత్రమే గ్రామకరణములుగా నుండుచువచ్చిరి. గణపతి చక్రవర్తి బ్రాహ్మణుల యందభిమానము గలిగి యుండుటచేత, నా యుద్యోగములన్నియు నియోగి బ్రాహ్మణుల కిప్పించ

వలసినదిగా దనమంత్రులలో నొక్కడైన పైగోపరాజు రామప్రధానిని నియమించెనని చెప్పుదురు. అప్పుడాతడు చక్రవర్తి ఆజ్ఞప్రకారము నియోగి బ్రాహ్మణులకు మితాశీల నేర్పరచి తెలుగు రాజ్యమందంతట నియోగి బ్రాహ్మణులనే కరణములుగా నియోగించెనని ప్రతి గ్రామము యొక్క స్థానిక చరిత్రమునందు వ్రాయబడియున్నది. కాని ఈ మంత్రి పేరు దెలుపునట్టి గణపతిదేవుని నాటి శాసనమొక్కటియైనను గానరాదు. ఇతని ప్రసిద్ధి ఆంధ్రదేశము నంతంతట వ్యాపించి యున్నదనుట వాస్తవము".

[ఆంధ్రుల చరిత్ర, మధ్యయుగము - 267 పుట] కాని యిందలి విషయము తప్పుగా గాన్పించుచున్నది. గణపతిదేవ చక్రవర్తి 13 వ శతాబ్దములోనివాడు. జి. మెకంజీ, కృష్ణా డి. మాన్యుయల్‌లో ఈయన 1190-1258 మధ్యలోని వాడని, జైనుల నధికముగా బాధలు పెట్టినవాడని వ్రాసెను. కొందరీయన కాలము క్రీ. శ. 1119-1260 అని వ్రాసినారు. ఆ కాలమునాటికి గోపరాజు రామన్న లేడు. కటకరాజులు లేక ఒడ్డెరాజులు అను ఉత్కట దేశములోని కటక సంస్థానాధిపతులు, తెలుగు దేశమును జయించి క్రీ. శ. 1134 మొదలు 1140 వరకు గుంటూరుజిల్లా దక్షిణము వరకు నేలిరి. వీరిలో గణపతి గజపతి ముఖ్యుడు. ఈయన ప్రధానియే, గోపరాజు రామన్న యని అనేక కైఫీయతులు, గ్రంథములు చెప్పుచుండ, గణపతి చక్రవర్తి మంత్రియని వ్రాయుట పొరపాటనుటలో సందియము లేదు. కృష్ణా డి. మాన్యుయల్ లో కూడ క్రీ. శ. 1145 సం. అక్టోబరు నెలలో సూర్యగ్రహణమువేళ రామయమంత్రికి రాజు రాష్ట్రముపై అధికారము ఏడుగడియల కాలమిచ్చెనని యున్నది.

# విశ్వబ్రాహ్మణ కరణాలపై ద్వేషభావము

గోపరాజు రామన్న చేసిన సేవను మెచ్చుకొని, గణపతి గజపతి వరము కోరుకొనుమని అడుగగా, అప్పుడడుగక, ముందెప్పుడో తన కవసరము వచ్చినపుడు అడిగెదనని చెప్పెనని, సూర్యగ్రహణము వేళ అడిగెనని కొందరు వ్రాసినారు. బ్రాహ్మణులకు శాశ్వత వృత్తులు గల్పించవలెనని, వారి దారిద్ర్యమును బాపవలెనని రామన్న ప్రధాని తలంచి యుండవచ్చును. హెచ్చుగా స్వకులజులయం దభిమానముకూడ ఉండవచ్చును. ఇవికాక విశ్వబ్రాహ్మణులు జైన, బౌద్ధమతస్థులయందు అభిమానము గల్గిఉండుటవలనకూడ రామన్నకు ద్వేషము గల్గవచ్చును. ఈక్రింది చారిత్రకాంశము సత్యముగా గాన్పించుచున్నది. గోపరాజు రామన్న తిరుపతికేగి, తిరిగి కుటుంబసహితముగా ఇంటికి వచ్చుచుండెను. త్రోవలో సత్తెనపల్లి తాలూకా "మాదల" గ్రామములో నొక బ్రాహ్మణుని యింట విడిది దిగెను. ఆ దినముననే తండ్రి అబ్దికము. నిమంత్రణము నకై ఒక విప్రుని నియమించుకొనెను. కాని ఆయన సర్కారు శిస్తు చెల్లించలేకపోగా, ఆ గ్రామకరణమయిన ఒక విశ్వబ్రాహ్మణుడు, ఆయనకు బండ కొయ్య వేయించెను. అబ్దికము పూర్తిఅయ్యేవరకు ఆయనను వదలుమని కోరినను, లేదా కొంతకాలములో తానే ఆ డబ్బును చెల్లించెదనని, రామ ప్రధాని ఎన్ని విధముల బ్రతిమాలినను, విశ్వ బ్రాహ్మణ కరణము వినడయెను. అంతట రామ ప్రధాని కెంతయో ఆగ్రహము గల్గెను. ఎట్లో పితృకార్యము నెరవేర్చుకొని, రాజధాని కేగెను. విశ్వబ్రాహ్మణులపై కసి తీర్చుకొనుటకు సమయము కొరకు నిరీక్షించుచుండెను.

ఇట్లుండ క్రీ. శ. 1144 (శా. శ. 1067) రక్తాక్షి నామ సం॥ భాద్రపద 30 వ రోజున గొప్ప సూర్యగ్రహణము పట్టినది. రాజు కృష్ణా నదిలో స్నానము చేయబోయెను. వైదిక బ్రాహ్మణులను రాకుండునట్లు చేసి, రామన్న ఒక్కడే రాజునొద్దకు చేరెను. సంకల్పము చెప్పు బ్రాహ్మణులు లేరని రాజు చింతించుచుండ, తానే పౌరోహిత్యము చేయుదునని చెప్పి, రాజు నొప్పించి, సంకల్పము చెప్పి, రాజుచేత ఏడు గడియల కాలము రాచరికము చేయుటకు ముద్రాధికారమునొంది, హస్తములో నుదకమును విడిపించుకొనెను.

శా. శ. 1067 లో ఈ విషయము జరిగినట్లు అనేక కైఫీయతులు, దండకవిలె, ముప్పదియిద్దరు మంత్రుల చరిత్ర తెల్పుచున్నవి. పులివఱ్ఱు (వ్యాఘ్రపురము) గ్రామకైఫీయతు యిట్లు చెప్పుచున్నది. "శా. శ. 1030 లో తూర్పున గణపతి సేనలతోవచ్చి, చోళరాజుల పలాయనము చేయించి, దేశము స్వాధీనము చేసికొనెను. ప్రధానులైన గోపరాజు రామన్నగారు ధర్మవంతుడైనందున దేశమంతటా పచాణంవారున్నూ, శూద్రులు కరణీకములు చేస్తూ బ్రాహ్మణులకు బాధోత్కారంగా ప్రవర్తిస్తూ ఉండుట రామన్నగారికి తెలిసి, శా. శ. 1067 న బ్రాహ్మణులకు గ్రామమిరాశి సనదులు వ్రాయించి...." అని ఉన్నది. భట్టిపోలు (Vol 14 — P. 142) కైఫీయతులో శూద్రకరణం నాయడి వీరప్ప, శూద్రకరణం వీరన్న అని ఉన్నది. ఇంకను తురుమెళ్ళ గ్రామ కైఫీయతులో "పూర్వం గజపతి సింహాసనస్థుడయిన గణపతి మహారాజు రాజ్యంచేసేటప్పుడు వారి ప్రధానులైన గోపరాజు రామన్నగారు శా. శ. 1067 న బ్రాహ్మణులకు కరణీకపు మిరాశీలు నిర్ణయించేయెడల, ఈ గ్రామానికి కౌండిన్యస గోత్రీకులైన రేటూరివారికి పాతిక, భారద్వాజస గోత్రీకులైన సాహివివారికి పాతిక ఈ ప్రకారంగా భాగములు నిర్ణయించి

నారు", [Vol V. P. 375] అని ఉన్నది. ఇంకను మండూరి గ్రామ కైఫీయతులో "గణపతి రాజ్యముచేస్తూఉండ, పంచాండులు, చతుర్థకులు కరణీకంలో ఉంది, దేవ బ్రాహ్మణ గౌరవములు తప్పించి, ప్రవర్తిస్తూ ఉన్న సంగతిపయిన వ్రాసిన గణపతి మహారాజులుగారి ప్రధానులైన గోపరాజు రామన్నగారికి తెలిసి .... " అని ఉన్నది. వీనినిబట్టి తెలుగు దేశములో కాపు, బలిజ, కమ్మ, విశ్వకర్మ కులములవారు కరణీకోద్యోగములలో నున్నట్లు స్పష్టపడుచున్నది. యెలియట్ శాసనావళి 1 వ సం. 677 వ పుటలో మంగళగిరి తా. ఉండవల్లి శాసనములో "కాపు కరణా అని యున్నది. వీరిని మార్చి బ్రాహ్మణులకు కరణీకముల నిచ్చినది. శా. శ. 1067 అగుట స్పష్టము. (క్రీ. శ 1144-) "గోత్రశాస్త్రైంబ రేందూనాం" అను దండకవిలె శ్లోక పాదమునుబట్టి శా. శ. 1067 అగును. ఇంకను

కం॥ ధర గోపరాజు రామన
కరణీకము లుద్ధరించు కాలము దలపన్
గిరి ఋతుగగన శశాంకులు
గర మొప్పెడు శకము నాటి కాలం బయ్యెన్॥

అను చాటువును బట్టికూడ, "అంకానాం వామనోగతిః" అను ప్రమాణాను సారము శా. శ. 1067 అగుచున్నది. ఇంకను గణపతి వారి వృత్తాంతము (Vol 50)లోగూడ "క్రీ. శ. 1144 లో గణపతిదేవు చేతను ధారపట్టుకొని, కరణీకపు మిరాశి స్థావరంబులు ఈ గోపరాజు రామన్న నియోగులకు యిచ్చెనని" యున్నది. ఇంకను 317 వ పుటలో "గజపతి అనే ఒడ్డెరాజు, ప్రతాపరుద్రుడు చనిపోయిన తర్వాత వచ్చును. ఆయన

వద్ద గోపరాజు రామన్న అనే బ్రాహ్మణుడు ప్రధాని. గణపతి దగ్గర ప్రధానియై యుండి ఈ గణపతి రాజ్యములో కరణీకాలు చేసే స్వర్ణ శిల్పులను ఆరువేలను, బలిజ కరణీకాలను తీసివేసి, అంతట బ్రాహ్మణ కరణాల ఉంచిన వయినము" అని ఉన్నది. ఇంకను 7 వ సంపుటములో 430 వ పుటలో గజపతి మహారాజులుంగారు కృష్ణాతీర భూములకువచ్చి ఈ రాజ్యం పాలనచేస్తూఉండే కాలములో, పంచాణ్ణులు, చతుర్థ కులజులు కరణీకంలో ఉండగా, దేవబ్రాహ్మణ గౌరవములయందు అనాదరణీయ ముగా, ప్రవర్తిస్తూఉన్నసంగతి, గణపతి మహారాజులుంగారి దగ్గర మహ ప్రధానులైన గోపరాజు రామన్నగారికి తెలిసి, ఎ. డి. 1144 రక్తాక్షి భాద్రపద బ॥ 30 సోమవారము సూర్యగ్రహణ కాలమున, నియోగులకు గ్రామ కరణీకము లిచ్చెను" అని ఉన్నది.

వీనినిబట్టి విశ్వబ్రాహ్మణులౌ కరణములకు, దేవబ్రాహ్మణ గౌరవములు లేవని, వారిపాలన బ్రాహ్మణులకు బాధాకరముగా నుండెనని రామన్న తెలిసికొని, వారిని తొలగించి, ఆయాతావులలో బ్రాహ్మణులను కరణీకపు ఉద్యోగములలో నియమించినట్లు తేలుచున్నది. ఆ బాధలేవియో తెలిసికొనుట కితరాధారములు లేవు. మాదల గ్రామములో జరిగిన ఉదంతము విశ్వబ్రాహ్మణ కరణము, ధర్మబుద్ధితో, నిష్పక్షపాతబుద్ధితో వ్యవహరించినను రామన్నకు మిక్కిలి కష్టముగల్గి యుండవచ్చును. ఇట్లు బ్రాహ్మణులకు, విశ్వబ్రాహ్మణులకు ద్వేషభావములు వృద్ధియై, క్రి. శ. 1 44 వ సంవత్సరములో జరిగిన చారిత్రక సంఘటనలకు త్రోవతీసినవి. ఎట్లయిన మాదల గ్రామకరణము చేసినపని, శ్రీనాథునికి జరిగిన పరాభవమువలె నున్నది. శ్రీనాథుడు 700 టంకముల పన్ను చెల్లించలేకపోగా భుజముపైన గుండు నెక్కించిరి "సార్వభౌముని

భుజా స్తంభ మెక్కను గదా నగరి వాకిటనుండు నల్లగుండు" అని శ్రీనాథుడే వచించినాడు.

పూర్వకాలపు శిక్షాస్మృతి అట్టిది కాబోలు. అట్టిచో మాదల గ్రామ కరణముపై "రామన్న" త్రాచుపాము పగ పట్టుట, అందరి ఉద్యోగముల తొలగించుట ధర్మవిరుద్ధమేమో!

ఊరె వీరభద్రకవి రచించిన "కరణీకోద్ధారిణి"లోని ఈ పద్యములో గూడ నిట్లే ఉన్నది.

సీ॥ శాలివాహన శక సంవత్సరములద్రి
రసపుష్కరేందుల నెసగుచుండ
రక్తాక్షి వర్ష భాద్రపద కృష్ణామా ప్ర
యుక్తుజవార సూర్యోపరాగ
సమయంబున గళింగ జననాయకా
గ్రణి గజపతివంశ ప్రకాశకుండు
గణపతిరాజ శాఖాసూత్ర గోత్ర సం
పన్నుడవే నీకు నిన్నియూళ్ళ

నసదృశంబైన గ్రామణిత్వాధికార
మున కొసంగెను, ననుభవింపుము రవీందు
తారకంబులు గల్గునందాక ననుచు
వేరు వేరున వచియించి, వెడలెనృపుడు॥

ఉ॥ ధీనిధి గోపరాజకుల దీపకుడై తగురామమంత్రి పం
చాణులయందు నిశ్చలత నానిన ఈ కరణీక ధర్మముల్
పూనిక జేసితీసి ద్విజపుంగవులం బిలిపించి యిచ్చె "నా
నా"వని సంతసించిరి నిరంతర సౌఖ్యమునొంది రందరు॥

ఈ సంవత్సరముకూడ శా. శ. 1067 అగుచున్నది. కాన ఈ రాజు గణపతి చక్రవర్తికాదని స్పష్టపడుచున్నది. ఈయన కళింగరాజని, గజపతి వంశీకుడని స్పష్టపడుచుండ, కాకతీయ గణపతిచక్రవర్తి యనుట పొరపాటు కాదా!

## బ్రాహ్మణులకు కరణీకాలు లభించిన విధము

ఆంధ్రదేశ చరిత్రము [అముద్రితము] యిట్లు వ్రాయుచున్నది.

[పుటలు 101 - 105]

"గణపతి దేవుగారు 360 వృత్తు....రి. గణపతిగారు ఈ తెలుగు దేశమం....శూద్రులకు.... బ్రాహ్మణ కరణీకాలు యిచ్చినారు. ఈ కథ శాసనములో నున్నది ఎట్లనగా : (పుట 101) బ్రాహ్మణ కరణీకములు (ఎ. డి. 1144) ఈ తెలుగు దేశమందు యింతకు పూర్వము స్వర్ణ శిల్పులున్నూ, చోళ రాజుల హయాములో దక్షిణ దేశమునుంచి వచ్చిన "శిష్ట కరణాలు" అనే అరవలున్నూ చేయుచుండిరి. కాశీదేశ బ్రాహ్మణులకు, వెలనాటి, వేగినాటి, కాసలనాటి, మురికినాటి, పెసలవాయి, తెలగాణ్యం, నందవరికులనే ఈతెగలవారికి వేరే జీవనోపాధులు లేకుండెను. అయితే కొందరు మాత్రము ఆయా రాజుల కొల్వులలో ప్రవేశించిరి. వారిలో పెసలవాయి నాటి బ్రాహ్మణుడగు గోపరాజు రామన్న, గణపతి గజపతివద్ద మంత్రిగా నేర్పడియుండెను. ఇట్లుండగా, ఈ ఆంధ్రదేశమందుండిన స్వర్ణశిల్పుల కరణములు, జైన బౌద్ధమతస్థుల ప్రేరణవల్ల ఈ కాశీదేశ బ్రాహ్మణులను గ్రామ వ్యవహార రీత్యేన, చాలగ బాధించుచుండిరి. ఈ బాధలకు ఓర్వలేక తమవాడగు గోపరాజు రామన్నకు, ఈ వృత్తాంతమంతయు జెప్పి, మొర పెట్టుకోగా, ఆయనకు అభిమానమున్నూ,

దయయున్నూ పుట్టి, స్వర్ణశిల్పులకు తగినపని చేయుదునని, వారికి యభయమిచ్చి పంపెను. పిమ్మట తన ప్రభువగు గణపతి గజపతిని ప్రార్థించి, శా. శ. 1067 కి సరియైన రక్తాక్షి నామసంవత్సర భాద్రపద బ॥ అమావాస్యనాడు గొప్ప సూర్యగ్రహణము పట్టినందున, ఆ పర్వ పుణ్యకాల నిమిత్తమై కృష్ణలో స్నానము: (సూర్యగ్రహణము ఎ. డి. 1144) చేయుచున్న తన ప్రభువగు గణపతి మహారాజును, "ఈ దేశ మందు.... నకు గ్రామకరణీకపు హోదాలు ద.... తో నీళ్ళు విడిపించు కొనెను. (హిందువులలో కరారుగా యివ్వడమైనదని తెల్పేగుర్తుకుగాను, దాత తన చేతులలో నీళ్ళు ప్రతిగృహీతచేతిలోకి విడవడము ప్రాచుర్యమై యున్నది.) ... గోపరాజు రామన్న తన తెగ బ్రాహ్మణు.... గణపతిదేవు చేత, తెలుగుదేశ గ్రామాదుల మీద కరణీక హోదాలు యిప్పించినందున తత్పూర్వపు కరణాలగు స్వర్ణశిల్పులు మొదలగువారు నిల్చిపోయిరి. కొన్ని జిల్లాలలో స్వల్పముగా స్వర్ణశిల్పుల కరణీకములునూ, కొన్ని జిల్లాలలో శిష్టికరణాలున్నూ కనపడుచున్నారు. ఇందుకు కారణమేమనగా గోపరాజు రామన్న ఈ బ్రాహ్మణులకు కరణీకము యివ్వక పూర్వము, ఏతన్నిమిత్తమై రాజును ప్రార్థించినదేమంటే, "ప్రభువుయొక్క ముద మొహర్లు తనవద్ద ఏడుగడియ లుంచబడునట్లు వరమడిగి తత్పూర్వమే తన మనసు నచ్చినన్ని గ్రామాదులకు ఆయావారిని యేర్పాటుచేసినట్లు, (హుకుములు) ఆజ్ఞాపత్రికలు వ్రాయించియుంచి, ఆ ఏడుఘడియలలోను ఈ హుకుములమీది ముద్రమొహర్లు వేసెను. ఆయేడు ఘడియల కాలములో ప్రథమమందు (యాజ్ఞవల్క్యులు) తనయాజ్ఞవల్క్య శాఖవారి కందంకి అయిన పిమ్మట, తక్కిన (బ్రాహ్మణులను యేర్పరచిన) కాగితములమీద మొహర్లు వేయించెను. తన శాఖవారుగాక తక్కిన బ్రాహ్మణులు ఆరువేలమంది నియోగింపబడేవరకు (ఎపాయింట్) అ

7 ఘడియలకాలము ముగిసినది. పిమ్మట మొహరు, రాజుగారు తిరిగి తీసికొనిరి. కావున వీలుపడదయ్యె. ఈ ప్రకారముగా కరణీకపు హోదాలతో ఏర్పడిన బ్రాహ్మణులలో యాజ్ఞవల్క్య శాఖవారికి ప్రథమమందు కరణీకములు ఏర్పడియెను గనుక ప్రథమ శాఖలనియు, పిమ్మట ఏడు ఘడియలు—గా నియోగింపబడిన ఆరువేల—రు వేల నియోగులనియు వాడు—అందువల్ల స్వర్ణశిల్పులు మొదలగువారు—ములు స్వల్పముగా మిగలడముకు కారణమైనది. ఈ కథను సూచించెడి శాసనము ఎట్లనగా (పుట్ నోట్ చూడుడు) ఇట్లు ఇంకా కొందరు స్వర్ణశిల్పులు నెంబరు శాసనములో ...

శ్లో॥ గోత్ర శాస్త్రాంబ రేందూనాం సంఖ్యాబ్దే శాలివాహనే
గ్రామస్థావర వృత్తింశ్చ కృతవాన్ గణకాగ్రణీః
శ్రీమాన గణపతి ర్వ్యాపోగణ పత్యాన్వయోద్భవః
అస్మిన్ భూమండలే తస్య బహవస్సంతి మంత్రిణః
తేషాం శ్రేష్టతమో మాత్యోయాజ్ఞ వల్క్యోత్తమోద్విజః
గోపారాజాన్వయోత్పన్నో రామాఖ్యోగణకాగ్రణీః
రక్తాక్ష్యబ్దే మాసిభాద్రపదే బహుళ పక్షకే
దర్శేర్క గ్రహణే పుణ్యకాలేంగారక వాసరే
గణకానాం హితార్థాయ సద్యశస్థాపనాయచ
తిష్ఠతశ్శశి మార్తాండ యావత్తావచ్చ పద్ధతాం
తథారాజ్ఞో గ్రహీద్దానం కృష్ణవేణీనదీ తటే
గ్రామస్థావర వృత్తింశ్చ సాక్షిణస్సర్వ దేవతాః.

ఇట్లు యింకాకొందరు స్వర్ణశిల్పులు కరణములలో మిగిలియుండుటకు సహింపక, తన జనమునకు బాధ కలుగజేసిన మంత్రి మహా నాడు వారిని (ఎబౌట్ 10375 ఎస్. ఎస్.) యింకాకూడ వచించవలెనని, గోప

రాజు రామన్న మంత్రికి, అభిప్రాయము కలిగినందున, కరణీకపు హోదాలతో ఏర్పడిన నియోగులను, యింక కొందరు శూద్రులగు మాల వాండ్లను ఒక కట్టగా నుండునట్లు ఏర్పరచి, స్వర్ణశిల్పులను వంచించ వలసినదిగా ప్రోత్సాహపరచినాడు. కుందుగలు మొదలగు కొన్ని కులాల వారు, ఆ స్వర్ణశిల్పులను వంచించుటకు యిష్టపడనందున, అట్లు ఒప్పు కొనని "మాదిగ" గమళ్ళ మొదలగు కొన్ని వర్ణాలనున్నూ, స్వర్ణ శిల్పులనున్నూ, వేరుచేసి యిష్టపడిన తక్కిన వర్ణాలవారు చాలగ నున్నం దున "మహానాటి" అని పేరుపెట్టి వాండ్లకు చేసిన కట్టు ఏమనగా:-

మహా అనగా విస్తారము; నాడు దేశము; చాలాదేశములవారు అనగా చాల వర్ణములవారు కూడి, స్వర్ణశిల్పులను వంచించుటకు ఏర్పడి నందున, "మహానాడు" అని వాడుక వచ్చినది. మంత్రి (రామన్నమంత్రి) పురోద్బలముచే నేర్పడియె గాన "మంత్రి మహానాడనియు" పిలువ బడును.

స్వర్ణశిల్పులయన్నము ఇతరులెవ్వరు తినకుండ, వారిని శుభ ప్రయోజనములకు యితరులు పిల్వకుండ, వారి యిండ్లకు పో—ళ్ళకు శుభకార్యములయందు వాద్యము.... అలంకారములు లేకుండా దారు గొడు —ము సహా మొదలగు యానముల నెక్క—కుం-. కట్టుదిట్టముల నేర్పరచి వంచించసాగిరి. ఇట్లు నాటనుంచి నియోగులు వృద్ధి అయినకొద్దీ ఈ స్వర్ణశిల్పుల వర్ణస్థులకు అనేక వంచనలు ఏర్పడి చాలగ బాధనొందిరి. ఇక్క—డికి ఏడు ఎనిమిది వందల సంవత్సరముల నాటినుండి తరతరము లుగా పడుదూ ఉన్న ఈ వంచన ప్రస్తుతము భూమండలాధిపత్యము చేయుచున్న శ్రీ ఇంగ్లీషు ప్రభుత్వపు నిష్పక్షపాత పరిపాలనలో నిశ్శేషముగా నివారింపబడి స్వర్ణశిల్పులున్నూ, తక్కిన వర్ణస్థులుకూడా ఆంధ్రదేశమంతయు నిర్విచారులై సుఖించుచున్నారు. ఇదియే ఈ దేశ మందు చెప్పుకొనెడి మంత్రి మహానాటి పూర్వోత్తరము.

కరణీకము లేకుండా నున్నవారు వైదికులు అనబడుచున్నారు. కరణీకపు హోదాలకు నియమింపబడక, ఆ పనులలో తిరుగుచుండినవారు "కరణ కమ్మలు" అనబడుచున్నారు. యె--ఎవరు ఏర్పరచబడినది గ్రంథ బహుళ--య లేదు. (వైడ్ ఎం. ఎస్. ఎస్. 2-3-4 హిందూమత గ్రంథ సంగ్రహము--ము కనబడును.)

ఈ కరణీకపు హోదాలు బ్రాహ్మణులకు కలిగిఉన్న జిల్లాలన్నియు అప్పట్లో గోపరాజు రామన్న మంత్రియొక్క ప్రభువైన గణపతిగజపతి ఏలినాడని చెప్పతగియున్నది. ఆ జిల్లాలు ఏవిఅనగా, నెల్లూరు, కడప, కందనూరు, కొంత బళ్ళారి, హైదరాబాదు రాజ్యము, కొంత ఒరంగల్లు ప్రాంతము కృష్ణా, గోదావరి, విశాఖపట్టణము, గంజాము కొంత, యీ జిల్లాలలో బ్రాహ్మణ కరణీకము లున్నవి. తక్కిన శిస్తు, దుస్తులు మొదలగువాటి ఏర్పాటులను గురించి ఒక రాజుకాలములో నిర్ణయమైనవి. మరియొక సంస్థానపురాజు కాలములో రద్దు చెయ్యబడుచుండినవిగాని యీ కరణీకపు హోదాలప్రమేయము మాత్రము యే ప్రభుత్వము మారి, ఏ ప్రభుత్వము వచ్చినప్పటికి అప్పటినుంచి యిప్పటికి మారకుండాఉన్నది. పిమ్మట ఈ హోదాలు కొందరు ఇతరులకు అమ్ముకొనుటవలన వైదికులు మొదలగు వారలకుకూడ యిప్పుడు కరణీకములు కలిగియుండుటకు కారణమయ్యెను.

ఈ గణపతి రాజుల పరిపాలన కాలము స్వల్పభాగమైనప్పటికి రాచకార్యపు మార్పులు చాలా గలిగినవి. అనగా పూర్వరాజుల కాలములో ఉన్న పద్ధతులకు భిన్నముగా, దుగ్గిరాల వంటి కొన్ని గ్రామాదులు క్రొత్తగా యేర్పడుటయు, దానికి హద్దులలో కొంతభూములు కట్టబడెను. అందునబట్టి చుట్టుపక్కల గ్రామాదులకు పొలిమేరలు హద్దులు యేర్పరచుటయు, తత్పూర్వము ప్రభువునకు కప్పము చెల్లబడే గ్రామాదులకు,

ఆపన్ను కొట్టివేసి అగ్రహారము లిచ్చుటయు, గ్రామోద్యోగములలో తత్పూర్వమున్న వారిని నిల్కడపర్చి నియోగ కరణీకములు యేర్పర చుటయు, (శాసన దృష్టాంతములవల్ల) నిట్లు వీరి హయాములో జరిగి నట్లు కనిపించినది".

పై ప్రమాణమే కాకుండా, స్వర్ణశిల్పుల కరణీకముల దీయించి ద్విజులకిచ్చిన వృత్తాంతము కరణముల వంశములోని వాడగు పైడిపాటి వేంకట నృసింహకవి యిట్లు వ్రాసెను.

గీ॥ గ్రహణవేళ గోపరాజు రామన గోల
కొండ ప్రభువుచేత గొనిన దాన
మహిమ దుష్టమతుల మడియించి స్థావర
జీవనములు ద్విజుల జేర్చె మున్న"

ఈ విధంబుగా దారిద్ర్యములోనున్న ద్విజసంతతిని, "రామన్న" ఏదో నెపముతో నుద్ధరించెను. కాని విశ్వబ్రాహ్మణ వంశీకులకు తీవ్రమైన అపకృతి యొనర్చెను. వంశపారంపర్య వచ్చు వారి కరణీకపు ఉద్యోగ ముల తొలగించుటచేత వారిలో ననేకమందికి జీవనోపాధి పోయెను. ఈ విధముగా "రామన్న" 535 గ్రామములలోని విశ్వబ్రాహ్మణ కరణములను తొలగించి, బ్రాహ్మణులను నియమించెనని "కొండవీటి దండకవిలె" తెల్పుచున్నది. "కొండవీటి హవేలి"లో 580 గ్రామముల కరణముల మార్చెనని మరియొక ప్రమాణము తెల్పుచున్నది. అందుచేతనే గోపరాజు రామన్నకు "కరణీకోద్ధారకుడని" బిరుదు వచ్చినది. ఇంకను ఈయనను కవులు దేవేంద్రుడని, సర్వదేవతా ప్రీతికరుడని, ప్రశంసించిరి. కవులు ఎన్నటికైన సమర్థులే కదా!